శ్రీః

# పిండపితృయజ్ఞ నిర్ణయము

నెం ౨ రు

# పిండపితృయజ్ఞ సమీక్షా సమాలోచన

నెం ౨ రు

మల్లావఝ్ఝుల వేంకట సుబ్బరామశాస్త్రి

శ్రీమత్పరమహంస పరివ్రాజక, నారాయణానందేంద్ర
సరస్వతీ స్వాములవారిచే
ప్రకటింపఁబడినది



విరోధి వత్సర ఆశ్వయుజమాసము
౧౯౪౯

టించినచో, దమసభ్యుల కపార్థమును బోధించెదరను వెఱ
పున, తెనుఁగున బ్రకటించుచుంటిని. ముఖ్యముగా, నా ప్రతి
కక్షుల నెం. ౨ రు పత్రికయందు బరిశీలింపదగిన విషయము
లయిదు గన్పట్టుచున్నవి. —

౧. తైత్తిరీయసంహితా, బ్రాహ్మణ, కల్పసూత్రము
లందు, దర్శపూర్ణమాస ప్రకరణ మధ్యలో నీ పితృయాగము
నుపదేశించినందున, నీరెంటికి యధికృతాధికార భావము
కలదనియు —

౨. ఈ పిండపితృ యజ్ఞము. పురుషార్థమైనను, అద్దానికి
దర్శయాగ నిష్క్రయణమే ఫలముగాని వేరొండు లేదనియు—

3. తైత్తిరీయబ్రాహ్మణ 1-3-10 లోని వాక్యము ఫల
విధి యనియు —

౪. కాత్యాయనుడు, జీవత్పితృకాహితాగ్నికి పిండపితృ
యజ్ఞానారంభమును, తన సూత్రములందుపదేశించి యుండ
లేదనియు —

౫. ఈవిరోధి నవరాత్రములలో జరుగు వేదసభలో మా
వాదమును రుజువుచేసికొనినచో, రు. 116/లు బహు
మానము నిచ్చుటకు, సభవారు సంసిద్ధులనియును—

ఇందు మొదటినాలుగు విషయములు నా తొలిపత్రిక
యందు పలుమారు సమాహితము లయినను, మరలి నా
ప్రతికక్షులు ఈ విషయముల నుద్దేశించియే రెండవపత్రికను

ప్రకటించినందున, యథాక్రమముగ, నీవిషయములకు సమాధానమొసగుచుంటిని. కావున పండితలోకము నిందలి సరసతను గ్రహింపగోరుచున్నాను.

౧. దర్శయాగములకు, అన్వాధానకాలము, యాగకాలము, అను రెండు కాలములు గలవు. అందమావాస్య అన్వాధాన కాలము, ప్రతిపత్తు యాగకాలము. దర్శయాగము, అమావాస్యా ప్రాతఃకాలముతో ప్రారంభమయి, ప్రతిపత్ప్రాతఃకాలముతో నంతమొందును. పితృయాగము అన్వాధాన దినాపరాహ్ణమున గాని. యాగదినాపరాహ్ణమునగాని, కాలవశమున జేయవలసి వచ్చును. కావున పితృయాగ మొకానొకప్పుడు దర్శయాగానుష్ఠానకాల మధ్యనునుష్ఠింపవలసి వచ్చును. కావున, దర్శయాగ ప్రకరణమధ్య నీ పితృయాగము పదేశింపబడినది గాని, వేరొండుగాదు.

కావున నీ దర్శపితృయాగములకు కాల సంబంధమే గాని, వేరొండు సంబంధ మెంతమాత్రమును లేదు.

కనుకనే కల్పసూత్రమునందు "అమావాస్యాయాం యదహః ... ఃకురుతే అపరాహ్ణే" అనుసూత్ర వ్యాఖ్యానసందర్భములో రుద్రదత్తుడు "తన్మధ్యోపదేశస్తుపక్షే తత్కాల మధ్య పాతాత్" అని వ్రాసిరి. ఈవిషయ మింతకుమున్నే కతూరి తొలిపత్రికయందు నిరూపించి యుంటిమి.

కావున మా ప్రతికక్షులు శ్రుతి సూత్రములయందు, దర్శపూర్ణమాస ప్రకరణ మధ్య నీపిండపితృయజ్ఞమునుబోధిం

చినందున, నవశ్యమీ రెంటికి కాలసంబంధముకంటె నెద్దియో యొక సంబంధముండి తీరవలెననుకొనుట గాని, అయ్యాది యధికృతాధికార భావమనుకొనుట గాని, భ్రాంతివిలసితము.

౨ మఱియు. నా ప్రతికక్షులు వారి నెం. ౨ రు పత్రిక లోని, 3-4 పేజీలలో అచ్చుటచ్చుట, శబరస్వామి పలుకుల చిలికించిరి. ఆ పలుకులను బట్టిచూడ, పిండపితృ యజ్ఞము, పురుషార్థమగు ప్రధాన కర్మయనియు, నద్దానికి దర్శయాగ నిష్క్రయణము దక్క వేరొండుఫలము లేదనియు, తై. బ్రా. 1-3-10 అనువాకములోని "పితృభ్యఏవ తద్యజ్ఞంనిష్క్రీయ" ఇత్యాది వాక్యము, పితృయాగమునకు ఫలశ్రుతియనియు, నందువలన, నయ్యదియర్థవాదగాక, ఫలవిధియే యనియును, వారియాశయము స్పష్టమగు చున్నది. వీరి వాదమునకు సాధుత్వమొసగదలచిన సమీక్షకులీ వాక్య మితికర్తవ్యతావిధా యకమని, వారి పత్రికయందు వ్రాసిరి. వీరిపుడద్దానినే ఫల విధి యనుచుండిరి. ఇంక నీవాక్యము ముందేవిధికానున్నదో తెలియకున్నది. ఎటులయినను పితృయాగము పురుషార్థమయి నచో, నద్దానికి, దర్శయాగ నిష్క్రియణము ఫలమగుట గాని, దర్శయాగ నిష్క్రయణమే ఫలమయినచో, నది పురు షార్థమగుటగాని, పొసగదు. క్రత్వర్థ పురుషార్థములకు, శాస్త్రకర్తలు, నిష్కృష్టముగా లక్షణ పరిష్కారమును, చేసియుండిరి. పితృయాగమునకు, దర్శయాగ నిష్క్రయణము ఫలమయినచో. నాఫలము, శాస్త్రాధీనేచ్ఛా విషయమగును. అట్టిఫలమునుద్దేశించి విధింపబడిన పితృయాగము. పురుషార్థ

మెన్నటికిని గానేరదు. స్వయంప్రార్థితములగు ఫలములనుద్దేశించి విధింపబడిన కర్మలే పురుషార్థములని, శాస్త్రసిద్ధాంతము. కావుననే మీమాంసకు లీ పితృయాగమును, ప్రధానమగు పురుషార్థముగ నెప్పి, దానికి స్వర్గము ఫలమని, నిరూపించిరి. ఉత్తరతంత్రమునందలి మఱికొందరు ప్రామాణికులు గూడ నీ సిద్ధాంతమునే యంగీకరించిరి. పితృయాగమునకు దర్శయాగనిష్క్రియణము ఫలమని, యంగీకరించిన ప్రామాణికుల మెచ్చునకొక రిని చూపుడు ?

3. మఱియు తై. బ్రా. 1-3-10 అనువాకము పితృయాగమునకు కాలవిధాయకముగాని, ఫలవిధాయకము గాదు. చూడుడు, విద్యారణ్యమహాశయుల ఆ యనువాకావతారికను. "అథేదానిం పిండపితృయజ్ఞఉచ్యతే తస్యకాలం విధవిధత్తే." అని, కావున పిండపితృ యజ్ఞమునకు దర్శయాగనిష్క్రియణమే ఫలముగాని, వేరొండుఫలము కాదనువాదము నిర్మూలము — అందువలన తదనుష్ఠాత లాచరించిన దర్శయాగములు ఫలశూన్యములు కావు. ఇక నీ పితృయాగము నిత్యమను పక్షముతో, తదకరణమందువచ్చు ప్రత్యవాయము తత్ఫలాప్రాప్తి, అనగా దర్శయాగ నిష్క్రియణము సిద్ధించక పోవుట, యనునది అత్యంత విరుద్ధము. ఈరెంటికిని యధికృతాధికార భావము గాని, సాధనఫల సంబంధముగాని, సిద్ధించినచో నా నియమముండునుగాని, యయ్యది వివాదగ్రస్తముగానుండగా ఆ నియమమెట్లు పొసగును ?

కావున మిగిలిన నిత్యకర్మల నాచరించనపుడెట్టి ప్రత్యవాయ ప్రాప్తియో, ఏతదకరణము వలన సంభవించు ప్రత్యవాయ మట్టిదియే. కావున నుభయత్రా పీరిదర్శాదులు ఫలప్రద ములే.

8. కాత్యాయన కల్ప సూత్రమునందలి చతుర్థాధ్యాయము, "అపరాహ్ణే పిండపితృయజ్ఞః చంద్రాదర్శనే౽మావాస్యాయామ్" అను సూత్రముతో నుపక్రమింపబడి, "అథత్తేతిమధ్యమపిండం పత్నీప్రాశ్నాతి "పుత్రకామా" అను 22 వ సూత్రము వరకు, పిండపితృయజ్ఞము నుపదేశించెను. ఆపైన కాత్యాయన మహర్షి సూత్రము లిట్లున్నవి.

"ప్రేతేభ్యోదదాతి జీవపితృకోపీ జీవాంత్వాహితే౽పి" 23

"జీవ పితృకస్యహోమాంతం" 24

"అనారంభోవా" 25 "నహ్య వేతేజాతూకర్ణ్యః" 26

"నజీవంతమతి దదాతీ తిశ్రుతేః" 27

"పూర్వోవా౽౦గత్వాత్ పిండపితృ యజ్ఞః" 28

"ప్రకరణకాల లింగానుగ్రహావచనా నాహితాగ్నిశ్రుతిభ్యోనాంగమ్" 29

"అంగంవాసమభివ్యాహారాత్" 30 అని.

ఇట్లు చతుర్థాధ్యాయమునందలి ప్రథమ కండిక ముగిసినది. ఇవ్విధమున కాత్యాయనుడు చతుర్థాధ్యాయ ప్రథమ

ఇట్లు కాత్యాయనశ్రౌతసూత్రగభస్తిమాలి సహస్ర కిరణములతో భాసిల్లుచుండ జాత్యంధులగు మా ప్రతిపక్షుల కీయవి కానరాక, నేను నా పత్రికయందు వ్రాసిన "ఆహితాగ్నీనామపి జీవత్పితృకాణాం పిండపితృయజ్ఞానారంభః । కాత్యాయనప్రభృతిభిః కైశ్చిత్సూత్రకారైరభ్యుపగతః"– అను విషయమును ఖండింపసాగిరి.

పాఠక మహాశయులారా! మా ప్రతిపక్షులిచ్చోట జేసిన మోసమును చూడుడు.

వారు వారి పత్రికయందిట్లు వ్రాసిరి:—

"కాత్యాయనకల్పసూత్రమందలి నాల్గవయధ్యాయము; "అపరాహ్ణే పిండపితృయజ్ఞశ్చంద్రాదర్శనేఽమావాస్యాయామ్" అను సూత్రముతో నుపక్రమింపబడి, "ఆధత్తేతి మధ్యమపిండం పత్నీ ప్రాశ్నాతిపుత్రకామా" అను 22 వ సూత్రమువరకు పితృయాగము నుపదేశించెను. ఆపై సూత్రములిట్లున్నవి. "ప్రేతేభ్యోదదాతిజీవపితృకోపి జీవాంతర్హితేఽపి" 23; "జీవత్పితృకస్యాహోమాంతం" 24; 'వ్యవేతేజాతూకర్ణ్యః' 25; 'నజీవంతమతీత్య దదాతీతి' 26; 'పూర్వోవాంగత్వాత్పిండపితృయజ్ఞః' 27; 'ప్రకరణకాల లింగానుగ్రహావచ నాహితాగ్నిః శ్రుతిభ్యోనాంగం' 28; 'అంగం వాసమభివ్యాహారాత్' 29 అని.

ఇట్లు 'కాత్యాయనశ్రౌతసూత్రభానుడు ప్రకాశించుచున్నను మా పూర్వపక్షఉలూకములకయ్యదికానరాక' అని.

ఇచట వీరు కాత్యాయన కల్పసూత్రములందలి 'అనారంభోవా' అను 25 వ సూత్రమును దిగ్రమింగి, 26 వ సూత్రమునందలి మొదటియక్షరమగు నకారమును నమిలివైచి 26 వ సూత్రమును 25వ సూత్రస్థానమున జేర్చి, 26న సూత్రమునకు 25వ నెంబరును వేసి, 30 సూత్రములతో ముగిసిన కండికను 29 సూత్రములతో ముగింపుచేసి, నా వాదమును ఖండించిరి,

ఇట్లు వీరు తమ సిద్ధాంతపోషణకు సూత్రములను దిగ్రమింగుచు, వారనినమాట కాదనినచో మనుష్యులను గూడ దిగమ్రింగజూతురు. ఇయ్యది కాష్ఠవాదమా ? లేక పాషాణవాదమా ? దేవతలపాలిట క్రవ్యాదులు ప్రవర్తించినట్లు, దేవతోద్దిష్టకర్మలపాలిట వీరు సూత్రాదులయి ప్రవర్తిల్లుచున్నారనుటకు సందియమేమి ?

శ్రౌతాగ్నిహోత్రికి విధింపబడిన దర్శపూర్ణమాస యాగములకు ప్రతినిధులుగ స్మార్తాగ్నిహోత్రికి ప్రతిప్రతి స్థాలీపాకములు విధింపబడినంతమాత్రమున సిద్ధాంతిగారు వ్రాసినట్లు దర్శాదియాగములయొక్క యాగదంశసాజాత్యము స్థాలీపాకములకు సూత్రక్రమమునుబట్టిగాని, శాస్త్రసిద్ధాంతమునుబట్టిగాని సిద్ధింపనేరదు.

కావుననిట్టి పరప్రతారణాబుద్ధితో నవనవక మీమాంసలను రచించి పైకి, ధర్మప్రచారకులమని చెప్పుకొనుచు, కర్మలను తారుమారుచేసి, కర్మానుష్ఠాతల నిందించుటకే

వారిచ్చవచ్చినటుల వారనుష్ఠించుచూ, తత్ఫలాఫలములను వారనుభవించుచూ, కృతార్థులగుట శ్రేయస్కరమని, ప్రతికక్షులకు నా సలహా.

తమ తొలి మీమాంసా పత్రికయందు మొట్టమొదటనే 'ధర్మార్థయామిభిర నుష్ఠీయతే' అని ప్రయోగించిన వీరికి లింగ, విభక్తి, వచన, ధాతు దుష్టమగు భాషయొకటున్నట్లు, పొడసూపుట గ్రుడ్డివానికి కండ్లొచ్చినట్లే —

భాషాదోషముల నెన్నుట మీకు వాంఛనీయమయినచో, నయ్యది వేరేప్రకరణముగ ప్రారంభించుకొనుట మాకు నభిమతమే. కాని ప్రకృతము విషయవిమర్శ నమావశ్యకమని నా యాశయము —

కనుక ఇకనైన శ్రుతిసూత్ర భాష్య మీమాంసల సరిగా నర్థము జేసికొని, ఆ యా గ్రంథములందలి విషయాను క్రమణికను, చిత్రించుటతో విషయ నిర్ధారణయయినట్లు, తృప్తిపడక ప్రకరణ సమన్వయమును జేసికొని, పూర్వాపర సమన్వయ విశేషణ, విశేష్యభావ, లింగవచన విభక్త్యాది పరిజ్ఞానము లేని, భాషాపూరితమయిన శుష్క విమర్శనలతో పత్రికల నింపుటకంటె, వేదవిద్బ్రాహ్మణ సమావేశమును జరపియందు దమవాదమును రుజువుచేసికొని విషయ నిర్ణయమును జేసికొనుట యుక్తమని నా యభిప్రాయము.

నా ప్రతికక్షులు వ్రాసినప్రకారము మావాదమును రుజువుచేసికొనుటకు శరన్నవరాత్రములలో గుంటూరునకు

వచ్చి, ఆంధ్రరాష్ట్రవేదసభా నిర్వాహకులగు బ్రహ్మశ్రీ భగవఛ్ఛాస్త్రిలగారిని మేము స్వయముగా నడుగగా, వారు యీ సభయందు యీవాదప్రసక్తి ఏమీ లేదని చెప్పినందున మా పత్రికకర్తలిచ్చిన యవకాశమును మేమువమ్ము చేయ లేదనియు, గావున వారి పత్రికయందలి తుదిపేరాకు మేమెంత మాత్రము బద్ధులము కామనియు, అక్రమముగ వారట్టి ప్రకటన గావించినచో, నా ప్రకటనయందు వారు వాడదల చిన "బ్రాహ్మణబ్రువులను" పదమునకు వారే వాచ్యు లగుదురనియును తెలియజేయుచున్నాను.

ఇంతవరకు జరిగిన మీ మా పత్రికలవలన పరస్పరా శయము అభివ్యక్తమయినది. ఇకముందెన్ని పత్రికలఁబ్రక టించినను, పూర్వపత్రికలయందలి విషయముల నామ్రేడిత మొనర్చుటకంటె వేరు ప్రయోజనము గనుపించుటలేదు. కావున నికముందీవిషయమును సభాస్థలమున నిర్ణయ మొన ర్చుటయే ముఖ్యకర్తవ్యమనియు, నింకనీవిషయమును మేము పత్రికా మూలమున ప్రకటించ మనియును, తెలియగోరు చున్నాను.

ఇట్లు,

మల్లావఝల వెంకట సుబ్బరామశాస్త్రి

# పిండపితృయజ్ఞ సమీక్షా సమాలోచ

## సంఖ్య ౨

ఇటీవల నా ప్రతికక్షులు, పిండపితృయజ్ఞ సమీ (సంఖ్య ౨) పత్రికను ప్రచురించి ది 22—9—49 తేది పోస్టుద్వారా నాకు పంపిరి. దానిని నేను సమగ్రముగ జదివితిని. కాని నాకా పత్రికయందుఁ బరిశీలించి సమాధానముఁ జెప్పదగిన ముఖ్య విషయములు కనుపించలేద అయినను కొన్ని నిస్సారములయిన పొడిమాటలకు సమాధాన మీయవలసివచ్చినందున, నందులకీ రెండవ పత్రికను ప్రచురించుచున్నాను.

కొలదికాలముక్రిందట గుంటూరుపురమున జరిగి మనుస్మృతిపాఠప్రవచన సందర్భములో రెండు విషయములు బయలుపడినవట. ౧. ప్రత్యాబ్దికమున పిండప్రదాన విషయము; ౨. పిండపితృయజ్ఞ విషయము. ఆ పురమునందలి యొకానొకగృహస్థు— ఈశ్వరప్రేరణచే నా రెంటిని యాచరింపదలచి, యందు పిండప్రదానవిషయమును ప్రత్యాబ్దికమున వారి పురోహితులచే నెరవేర్చుకొని, పిండపితృయజ్ఞము నాచరింపజేయుటకు ఆ పురమునందలి యధ్వర్యులను గోరిరట. ఆ యధ్వర్యులు శ్రౌతకర్మానుష్ఠానవిధానమున నాఱితేరినవారై చేయింప సమర్థులయినను, అచ్చోటి కర్మాచరణ విధానము, ప్రాచీనాచారక్రమానుసారముండ వీలుండదను

సందేహమున, వా రందులకు పరాఙ్ముఖులయిరట. అంత నా సద్గృహస్థు 'మీ రెంతవారైననేమి ? మా గురువులు చెప్పినట్లు చేయించరు కదా ! ' అని కూడ నొచ్చికొనిరట. అందుపై నా సద్గృహస్థు యితర శ్రోతుల బిలపించి యా యాగమును నెరవేర్చుకొనిరట. కావున నా యధ్వర్యులు పిండపితృయాగమును జేయింప పరాఙ్ముఖులగుటను కారణముగఁ జేసికొని, వారియందలి యసూయాభావముచే నీ పిండపితృయజ్ఞవాదము బయలుదేరినదట.

ఇదియంతయు నే నిదివరకాభాసప్రాయముగ విని యున్నను, యిపుడు మా ప్రతికక్షుల రెండవపత్రికయందు వ్రాసిన కథనుబట్టి యయ్యది నిజమని ఋజువగుచున్నది.

ప్రధానవిషయము లెవ్వియో యప్రధానవిషయము లెవ్వియో తెలియని శ్రీ ఓ. నీ కం. శా గారికి నేనన్ని విషయములు ప్రతిపాదించి వ్రాసినను, వారికవి ఏవ్రోవ్రాతల వలెనే దోచుచుండును.

నేను పిండపితృయజ్ఞము నాచరింపవలదని యెన్నడు ననలేదు. ఇకముందనబోను. కాని దర్శపితృయాగముల కంగాంగిభావముగాని, యధికృతాధికార భావముగాని, స్థిరపడనంతవరకు పిండపితృయజ్ఞమును, అగ్న్యాధానముచేసినది మొదలుగాని, మధ్యకాలము నుంచిగాని, యాచరించనందున దర్శాదియాగములు ఫలప్రదములు కావనుటకు వీరికేమి యాధారము. దర్శపితృయాగములు రెండును, ప్రత్యేకము

అయిన స్వతంత్రకర్మలుగాని, యీ రెంటికి పరస్పరసంబంధ మెంతమాత్రము లేదను సిద్ధాంతమున నేకతరా ననుష్ఠానముచే నన్యతరా ననుష్ఠానమునకు వైగుణ్యాశంక యుదయించు టెట్లు?

పితృదర్శయాగముల కధికృతాధికార భావసంబంధ మున్నదను సిద్ధాంతము, స్థిరపడినచో నపుడు పితృయాగము నాచరింపని వారల దర్శయాగములు ఫలప్రదములగు టెట్లని శంకించవచ్చు. అట్టిసిద్ధాంతమే వివాదగ్రస్తమగుచుండ, పితృయాగా ననుష్ఠాతల దర్శయాగములు ఫలప్రదములగుట యెట్లని. ప్రధానాక్షేపమేమి? పృచ్ఛయేమి. ఇందుకుసమాధానాభ్యర్థనమేమి? వివాదగ్రస్తమగు విషయమును మరచి యొడలు విరచుకొనుటయా?

పిండపితృయాగలోపము వలన, దర్శయాగమునకు లోపములేదు. తత్ప్రాయశ్చిత్తమువలన, దర్శయాగమున కుపకారమునులేదు. పిండపితృయాగలోపము నుద్దేశించి విధించిన సప్తహోత్మక ప్రాయశ్చిత్తము, మరలి పితృయాగాచరణ యోగ్యతకొఱకేగాని, దర్శయాగాచరణ యోగ్యత కొఱకుగాదు.

ఒకానొకకర్మ నాచరింపక లోపింపజేసికొనినందునం జేయు ప్రాయశ్చిత్తము, స్వాచరణయోగ్యత కొఱకుగాని, అన్యకర్మాచరణయోగ్యతకొఱకు గాదు. కావున నీయాక్షేప, పృచ్ఛా, సమాధానాభ్యర్థనములు నిస్సారములు. ఈ విషయము మేము మా తొలినిర్ణయ పత్రికయందు హేమాద్రి

వచసపురస్సరముగ నిరూపించియుంటిమి. కావున. నియ్యది యింతకుమున్నె సమాహితమయిన విషయమే. అయినను శ్రీ ఓ. సీ. కం. శా. గారు ఇదియొకగొప్ప యాక్షేపమనియు నిందుకు సమాధానమును మేముస్పృశింప లేదనియు, నందువలనమరల సమాధానము నభ్యర్థించుచుంటిమనియును వ్రాసికొనుట లోకవంచనగాని వేరొండుగాదు.

కుంచవరగ్రామమునందలి వేదసభలో నీ విషయము చర్చింపబడినతరువాత సంతకములుచేయు కాలములో నొకానొక పంతులుగారు అనేకమంది యధ్యాపకులతో సంభాషించి విషయముయొక్క యాథాతథ్యమును దెలిసికొనికాడ "అచట జరిగినది ప్రత్యాబ్దికమునందలి పిండప్రదానవిషయముగాని, మఱియొకటి గాదు" అని సాక్ష్యము నిచ్చుటను బట్టిచూడ నిట్టి సాక్ష్యమును తయారుచేయుటలో వారికిగల పాండిత్యమును ప్రకటించుకొనుటగాని వేరొండుగాదు నిజముగా నేయవధానిగారును మీరువ్రాసినట్లు చెప్పియుండరు. అట్లుచెప్పిన యవధానిగారి సంతకము యిందు లేదు. ఈ సంతకములుచేసినవారలలో నెవరు యీవిషయమునుచెప్పిరో తెలియపరచినచో ఆవల నిజానిజములు వారికే తెలియును.

పోనిండు. మా ప్రతికక్షులు వారి పత్రికయందును శ్రీవిద్యాపరిషత్సభ్యులచే దమవాదమను మోదింపఁబడినటుల వ్రాయుచుంటిరిగదా? సభ్యులందరు నీవిషయమెఱింగియే యనుమోదించిరా? నేను స్వయముగ నయిదారుగురుసభ్యుల

నీ విషయమునుగురించి యడుగగా. వారు మాకీగొడవయే యంతుపట్టలేదని నాకు చెప్పిరి. అదియట్లుండనిండు. నేను గుంటూరుపురమున నొకానొక గృహస్థునింట మీమాంసాపత్రికారచయితలతో నీవిషయమునుగురించి మాట్లాడుచుండగా, ఆ ప్రసంగమున— యాగాపరాహ్ణమునఁ జేయు పితృయాగమువలన పూర్వాహ్ణమున ముగిసిన దర్శయాగమున కధికారసిద్ధిగలుగుటెట్లని నేను ప్రశ్నింపగా, వీరు ప్రసక్తి కల్పించుకొని "నాకు తెలియక అడుగుతానుగాని, ఉపనయనాన్తరము కలుగబోవు బ్రాహ్మణత్వము నాధారపఱచుకొని, పుట్టిన బ్రాహ్మణశిశువునకు జాతకర్మాది బ్రాహ్మణసంస్కారములు జేయుటలేదా? అట్లే ముందుజేయబోవు పితృయాగమువలన సిద్ధింపనున్న యధికారమును పురస్కరించుకొని, యిపుడు దర్శయాగములు జేయకూడదా?"— అని వీరు నన్నడ్డుపరచినది; "ఉపనయనమువరకు జాతి బ్రాహ్మణ్యప్రయుక్తసంస్కారములనియు, ఉపనయనాన్తరము కర్మబ్రాహ్మణ్యప్రయుక్త సంస్కారములనియు" నేను వారికి బదులుచెప్పినది శ్రీ శాస్త్రిగారు మఱచిరకాబోలు. ఇపుడు గదా వీరు శ్రుతి- స్మృతి- కల్పసూత్ర- విద్యారణ్యకోవిదులయినది.

నిజముగ వారి పరిషత్సభ్యులందరుఁ దెలిసి యంగీకరించినచో, వారి పరిషత్సభ్యులలో నేను కోరినవి ద్వాత్సభ్యులచే వారివాదమనుమోదింపబడినటుల సంతకమును చేయించి చూపగలరా? ఇందుకంగీకరించినచో నేను పేరు వ్రాసి

పంపెదను. కావున 'అసెంబ్లీ'లయందువలె మాకు ఓట్లతో పనిలేదు— శాస్త్రవాదముతోనేకాని— యను గొడవలో మధ్య నీ పంతులుగారి సాక్ష్యమెందుకు ?

'పితృయాగము నాచరింపని యాహితాగ్నులుందురా' యను సందేహమునకు రుజువుగ మేము సంతకములతో రికార్డును తయారుచేయించి యిచ్చితిమి సరే. పితృయాగ మాచరింపని, యాహితాగ్ను లుందురను రికార్డు యిదివరకే తమయొద్ద సిద్ధమయి యున్నదికదా? అందు తాముకూడ చేరినవారేకదా ? కావునముందు తమరికార్డు నెచట దాఖలు చేతురు? తమరికార్డునందలి యపరాధులకు శిక్షానిర్ణయ స్థానమేది ?

ఆహితాగ్నులెవ్వరును, తాముచేయు దర్శయాగ త్యాగమును సాధింప నన్నాశ్రయించి యుండలేదు. నేనును అట్టివారి నుద్ధరింపనమకట్టి పత్రికలనువ్రాసి ప్రకటించియుండ లేదు. మీామాంసాపత్రిక వలనకూడ, నాహితాగ్నుల దర్శ యాగా నాచరణము బయలు పడుటగాని, యద్దానిని నేను సమర్థింపబోవుట గాని, యందువలన నాయశక్తత లోకము నకు వెల్లడి యగుటగాని. నేనద్దానిని తట్టుకొనలేక< గొందఱి నాశ్రయించుటగాని, నాభారమును వారిపై నుంచుటగాని, యెంతమాత్రము జరిగిన విషయము కాదు.

శ్రీ ఓ. నీ. కం. శా. గారు తమ నెం. ౨ రు. పత్రిక యందు 6 వ పేజీలో పలుమారు రెట్టించి యీా పైై అభూత

పంపెదను. కావున 'అసెంబ్లీ'లయందువలె మాకు ఓట్లతో పనిలేదు— శాస్త్రవాదముతోనేకాని— యను గొడవలో మధ్య నీ పంతులుగారి సాక్ష్యమెందుకు ?

'పితృయాగము నాచరింపని యాహితాగ్నులుందురా' యను సందేహమునకు రుజువుగ మేము సంతకములతో రికార్డును తయారుచేయించి యిచ్చితిమి సరే. పితృయాగ మాచరింపని, యాహితాగ్నులుందురను రికార్డు యిదివరకే తమయొద్ద సిద్ధమయి యున్నదికదా? అందు తాముకూడ చేరినవారేకదా? కావునముందు తమరికార్డు నెచట దాఖలు చేతురు? తమరికార్డునందలి యపరాధులకు శిక్షానిర్ణయ స్థానమేది?

ఆహితాగ్నులెవ్వరును, తాముచేయు దర్శయాగ త్యాగమును సాధింప నన్నాశ్రయించి యుండలేదు. నేనును అట్టివారి నుద్ధరింపసమకట్టి పత్రికలనువ్రాసి ప్రకటించియుండ లేదు. మీామాంసాపత్రిక వలనకూడ, నాహితాగ్నుల దర్శ యాగా నాచరణము బయలు పడుటగాని, యద్దానిని నేను సమర్థింపబోవుట గాని, యందువలన నాయశక్తత లోకము నకు వెల్లడి యగుటగాని. నేనద్దానిని తట్టుకొనలేక గొందఱి నాశ్రయించుటగాని, నాభారమును వారిపై నుంచుటగాని, యెంతమాత్రము జరిగిన విషయము కాదు.

శ్రీ ఓ. సీ. కం. శా. గారు తమ నెం. ౨ రు. పత్రిక యందు 6 వ పేజీలో పలుమారు రెట్టించి యీా పై అభూత

విషయమును వ్రాసిరి. దీనినిబట్టిచూడ, వీరు వాదోద్రేక ముచే, మతి మరచి ప్రవర్తించు చున్నట్లు లోకమునకు స్పష్ట మగుచున్నది.

మా నిర్ణయ పత్రిక యందలి 2 వపేరాలో, అచ్చు వారి లోపమువలన నసమాపక వాక్యచిహ్నమునకు బదులుగ పడిన జంటగీతలవలన, గ్రంథాదియెందెంతయో యపభ్రంశ మున్నదని యూహించిన. శ్రీ శాస్త్రిగారికి, వారిపత్రికయం దారవ పేజీలో రెట్టించి వ్రాసిన వాక్యముల వలన, నింత యపభ్రంశమున్నట్లు యెట్లూహాగోచరము కాలేదో తెలియ కున్నది. అపభ్రష్టబుద్ధులకుఁ దమ యపభ్రంశములు గోచ రింపవు కాబోలు. నేను వారిని ప్రతికక్షులని పేర్కొనినందున నా పత్రికయందు పడినగీతలను వారు ప్రతికక్షిభావముతో, నన్వయించినట్లు వ్రాసిరి. వారును నన్నట్లే పేర్కొనిరి కావున నేను వారి వాక్యములను ప్రతికక్షిభావముతో నన్వయించి నను, తప్పులేదను నిర్ణయజ్ఞానముతో వ్రాసిన వ్రాతయే కదా ? యిది.

శ్రీ శాస్త్రిగారు, హస్తాక్షర విన్యాసముల యందర్హాత గమనించలేదని యాక్షేపించిరి. వీరిస్కూలులో నుపాధ్యాయ వృత్తులకు హాజరుపట్టీ యుండునుగదా ? అందువీరు ప్రాచ్య విద్యాపండితులును, తత్రాపి వేదాంతపారీణులును, వ్యాకరణ ధురీణులును, అయినందున వీరి యర్హాత ననుసరించి, వీరికి సంతకములయందు గౌరవము నొసగుచుండిరా ?

సభలయందు సోమపీథులకు సంతకములతో, పూజ యని వీరి యభిప్రాయము. (శ్రీ) శాస్త్రిగారికి సాటి యుపాధ్యాయ బృందమునందాగౌరవము జరుగుచున్నదా? కావున నిట్టి నిరర్థకపు వ్రాతలతో పత్రికల నింపుచు, పైపెచ్చు మేము కాష్ఠవాదులము కామనియు, శాస్త్రవాదులమనియు, శాస్త్రవాదముచే వాదమును, నిర్వహించు కొన్నవారికి రు. 116/ లు పారితోషిక మిచ్చెదమనియు, సవాలుచేయుట నిరర్థకాహంకార పూరిత వాగ్జాలమని లోకులు గ్రహింపక పోరు. వీరి తోటి శాస్త్రవాదమునందును యిట్టి నిస్సార మయిన విమర్శన లేకదా బయలు దేరును.

కావున వృథా ప్రసంగములతో తమ పత్రికల నింపు కొనుచు, పరులను నిందించినంతమాత్రమునఁ దమ గ్రంథము లుచితములని వివేకులు గ్రహింతురనుకొనుట యజ్ఞానవిలసితముగాని వేరు కాదు.

నేను నా తొలి "సమాలోచన" పత్రికయందు, శాస్త్రిగారు జూపిన విషయములన్నింటికి ప్రమాణపురస్సరముగ సరియయిన జబాబు యిచ్చియుంటిని. కాని వారి కది యంతయు 'బూతులబుట్ట' క్రింద పరిణమించినట్లు వారుల్లేఖించిరి. కావున వారికి వాటియందపారపాండిత్యమనియు, ప్రతి విషయమునకును పరమ తాత్పర్యము వారు వాటియందే సమన్వయపరచుకొనిమెదరనియును సుస్పష్టమగుచున్నది.

౧. నేను నిగూఢముగ పితృయాగానాచరణమును బోధించుచుంటిననియు, మా ప్రతికక్షులు దర్శయాగ వైయర్థ్యమును బోధించుటలేదనియును వ్రాసికొనిరి. ఇందలి తత్వము కొంత పరిశీలింతము. నా ప్రతికక్షుల తొలిపత్రికయందుపసంహారభాగమున, "యేతు పిండపితృయజ్ఞమననుష్ఠాయ దర్శేష్టిమనుతిష్ఠంతి, తైర్భస్మనిహుతం, తేషాంత దనుష్ఠానం నిష్ఫలం అనుష్ఠానాభాసంవా" అను వాక్యములున్నవి. ఈ వాక్యములన్వయముఖేన ; దర్శయాగముల వైయర్థ్యమును బోధించునది, పితృయాగాచరణమును బోధించునది ప్రామాణికులే గ్రహింపగలరు. వ్యతిరేకముఖమున "గావున పితృయాగమాచరింపుడు" అని యర్థము లభించినను, వాక్యములయొక్క యన్వయార్థము దర్శయాగవైయర్థ్యమనుటకు సందియము లేదు. వీరు పితృయాగాచరణరహితములయిన దర్శయాగములు ఆచారసిద్ధములను యాశయమును మదియందిడుకొనియే వాటిని దూషింపసమకట్టి యుడుంబరఫలగర్భతుల్యముగ పైకి పితృయాగావశ్యకర్తవ్యతను బోధించుచుంటిమని చాటించుకొనసాగిరి.

కావున మా ప్రతికక్షులకు దర్శయాగముల వైయర్థ్యమును సాధించుటయు, తత్సాధకముగ దర్శపితృయాగముల కెద్దియో యొక సంబంధమును కల్పించుటయు యావశ్యకము. దర్శపితృయాగముల రెంటికిని యెట్టిసంబంధము లేదని నిరూపించుటయు, దర్శయాగముల వైయర్థ్యమును పరిహరించుటయు మాకు కర్తవ్యము. ఇంతియకాని పితృయాగావశ్య

కర్తవ్యతోపదేశము వారికిగాని, తదకర్తవ్యతోపదేశము నాకుగాని యభిమతముగాదు. ఇయ్యది వాస్తవము.

శ్రుతియే కంఠోక్తిగ పితృయాగాచరణమును బోధించి యుండ, అందు వారిప్రయత్నము వ్యర్థము. దర్శపితృయాగముల సంబంధముమాత్రము శ్రుతివిహితముగానందున నట్టి సంబంధకల్పనకొఱకు వారిప్రయాసయు, తన్నిరాకరణకొరకు మా ప్రయాసయు సఫలముగావచ్చు.

శ్రుతివిహితమగు పిండపితృయజ్ఞమును సూత్రకర్తలు నిత్యమనియు, మీమాంసకులు కామ్యమనియు నంగీకరించిరి. ఇట్టితఱి నేనీ దర్శపితృయాగముల కథికృతాధికారభావాభావ నిరూపణావసరమున మీమాంసాసిద్ధాంతమును వ్యక్తపఱచియుంటిని. అందువలన మీమాంసాసిద్ధాంతమును బట్టిచూచినచో దర్శపితృయాగములకథికృతాధికారభావము సుతరాం ఘటింపదని నా యాశయము.

ఇట్టి నా యాశయము లోకమునకు సుబోధమగుచున్నను, శ్రీ శాస్త్రిగారు తమవాదమునకు లోటువాటిల్లునను పరిదేవనవలన, నేనీ సాకున పితృయాగానావశ్యకతను ఆహితాగ్నులకు బోధించుచుంటినని తమ పత్రికయందు వ్రాయుట 'శోకతిమిరాంధత' దక్క మరేమి ?

ఇట్టితఱి పితృయజ్ఞమునకు, కామ్యత్వమును సిద్ధాంతపరచిన, పూర్వమీమాంసకులును, దర్శపితృయాగముల

కంగాంగిభావము లేదని, నిరూపించిన సూత్రకర్తలగు నాపస్తంబులును, వీరి వ్రాతప్రకారము కామ్యత్వ వాద, అంగాంగి భావరాహిత్యవాద, వ్యాజములతో, పితృయాగా నావశ్యకతను, బోధించువారని యనవచ్చుగదా ? అట్టి మీమాంసకులను, వేదార్థ నిర్ణయకులనియు, ఆపస్తంబుల ప్రామాణికులగు సూత్రకర్తలనియు, దమపత్రికలయందెట్లంగీకరించిరి ?

మఱియు "నిత్యకర్మయే యను దృఢవిశ్వాసముగలవాడెవ్వడైన కామ్యత్వమును సాధింపగడంగునా ?" అని వ్రాసిరి. మనము కామ్యత్వమును సాధింపకున్నంతమాత్రమునగాని, శ్రుత్యర్థసారమెఱుంగని మూర్ఖుడెవ్వడేని, నిత్యకర్మయేయని, మూర్ఖాభినివేశముతో మొండితనమునగూర్చొండినంత మాత్రమునగాని, వేదార్థనిర్ణయైక దీక్షనుబూని, సింహగర్జనలతో, బయలుదేరిన మీమాంసాసిద్ధాంతము, శుష్కారావములచే సడలిసన్నగిలునా ? ఈ దుర్భ్రమ శ్రీ శాస్త్రిగారికేల ?

తమవాద మంగీకరించినచో పితృయాగానావశ్యకతను బోధించనట్లు, లేనిచో నద్దానిని బోధించినట్లు: అని శాస్త్రిగారి పూతికూష్మాండ గర్భాశయము.

ఆచార సంప్రదాయము వలన, పితృయాగానాచరణాముగల దర్శయాగానుష్ఠానములు కలవను సిద్ధాంతమును స్థిరపఱచుకొని, యవ్వాని వైయర్థ్యమును బోధింపవారు ప్రవర్తించిరి. కాన నట్టి వైయర్థ్యమును, పరిహరించుటయు, నందు

కనుమైన హేతువులను నిరూపించుటయును, నాకు ముఖ్యాశయముగాని, పితృయాగము కామ్యమేనని గాని, నిత్యమేనని గాని, పితృయాగమాచరింప వలదనిగాని, నాముఖ్యాశయముగాదు. అందు శాస్త్రకారుల యాశయమును వెలువరచుటయే నా ముఖ్యాశయము. ఇదియంతయు ప్రాతికూల్యాంశగర్భులగు (శ్రీ) శాస్త్రిగారి దుర్బోధయేగాని వేరొండుగాదు. కావున నీ శాస్త్రిగారిట్టి దుష్ప్రచారములతో నెంత విలపించినను, వారి వాదమునందలి సారమును రసికులు గ్రహింపకపోరు.

౨. నాపత్రికయందలి 2 వ పేరాకు వారుచెప్పిన యర్థముకంటె వేరేయర్థమును జెప్పుననకాశము లేదని, శాస్త్రిగారు వ్రాసిరి. ఈవిషయమొకింత దిలకింపుడు.

నానిర్ణయ పత్రికయందలి 1, 2 పేరాలు యిట్లున్నవి.

1. నిశ్చప్రచమేవేదం యద్వై పశ్చిద పశ్చిమానాం పిండపితృ యజ్ఞ నామకః కశ్చసహ పిర్యాగః అవశ్యానుష్ఠేయతయా శ్రుతి విహిత ఇతి.

2. బహోః కాలాదారభ్య శ్రుతి విహితకర్మానుష్ఠాతృభిరస్మదీయై రనూచానై శ్శిష్టైరయం నానుష్ఠీయత ఇతి, వినాచతదనుష్ఠానం దర్శయాగానుష్ఠానస్య వైయర్థ్యమవ్యాహత మితిచప్రథాయాః ప్రవృత్తత్వాద స్త్యవసరోఽస్యవిచారస్య" అని. ఇందు మొదటిపేరాయొకేవాక్యములో పూర్తి

యయినది. ఇఁక 2 వ పేరా॥ బహిరాఃకాలాదారభ్య ...
... ... నానుష్ఠీయత ఇతి, యనునంతవఱకొక వాక్యమును
"వినాచతదను ... ... ... విచారస్య" యనునంతవఱకొక
వాక్యమునయి యున్నది. ఇందు మొదటి వాక్యాంతమున
నచ్చుపొరపొచ్చెమున నసమాపకవాక్య చిహ్నమునకు బదు
లుగ రెండు నిలువుగీతలు పడినవి. కాని యీరెండు వాక్య
ములును, పరస్పరాకాంక్షగలవి.

ఇట్టిస్థితిలో, వీరిచటఁజేసిన 'యన్వయక్రమ మేమి
యనగా, రెండవపేరాలోని మొదటివాక్యమును, నిరాకాంక్ష
మగు మొదటిపేరాతో నన్వయించి, యందలి "నిశ్చప్రచ"
మనుదానితో, ముడిపెట్టిరి. ఇందుకు శాస్త్రిగారు చూపు
కారణ మేమనగా, వాక్యాంతమునగల రెండు నిలువుగీతలని
యనుచుండిరి. పోనిండు మరెచట నయినను వాక్య విరమణ
కిట్లు జంటగీతలు కలవా? అందుకొంటిగీతగాని, చుక్కగాని
చాలదా? అయినను రెండవ పేరాలోని 2 వ వాక్యాంత
మున నుండు "అవ్యాహత మితిచ" అను చకారము
పూర్వవాక్యానుకర్షకముగ నుండ, నద్దానిని మొదటిపేరాతో
ముడిపెట్టుటెట్లు? కావున 1 వ పేరాయొకే వాక్యముతో నిరా
కాంక్షమై ముగిసియుండగా, 2 వ పేరాలోని 2 వ వాక్యాంత
మునను చకారము, పూర్వవాక్యము ననుకర్షించు
చుండ, నందలి మొదటివాక్యమును దెచ్చి 1వ పేరాతో
నన్వయించి యీ వాక్యముల కింతకంటెవేరే యర్థమునుఁ

ఇచట శ్రీ శాస్త్రిగారు "ధర్మప్రవర్తకాచార్యుల వారి యనుమతితో" అని వ్రాసిరి. ఇందు 'అను' అనుపద మనవసరము. పొరపాటున శ్రీ శాస్త్రిగారు ప్రయోగించిరి. ఏలనన, వీరికీవిషయమునందొక ప్రత్యేక మతియున్నచో, వారి యనుమతి యవసరము. వీరికట్టిమతియే లేనపుడు వారి మతియే చాలును. ఇంక ననుమతియేల ?

కర్మానుష్ఠాతలగు పెద్దలు తమ కర్మానుష్ఠానములా యందలి లోపాలోపములను వివిధదేశీయులగు పెద్దలవలన, శాస్త్రజ్ఞులవలనను, సవరించుకొనియే ప్రవర్తించు చున్నారు. ఇదివరకును ప్రవర్తించియున్నారు. శ్రీ శాస్త్రిగారు తెలియ జేసినట్లు సవరించుకొనలేదను దురభిమానముతో వారీ వ్రాతలను వ్రాయుచున్నారుకాని కర్మానుష్ఠాతల ప్రవృత్తి పరీక్షాపూర్వక మయినదనుట నిశ్చితము. కావున నట్టి ధర్మానుష్ఠాతల ప్రవృత్తిని యసూయాభిమానులు, విమర్శించుట దోషావహమును, సాహసప్రవృత్తియు ననుట యతిశయోక్తి కాదు.

ఆహా ! శ్రుతివిహితమగు పిండపితృయజ్ఞము కొందరి మతమున కామ్యమని యన్నచో, నయ్యది. యాచరింపవల దని బోధించినట్లర్థమా ? అట్లైనచో శ్రుతి యెన్ని కామ్య కర్మలను విధించినది. వాటినన్నిటిని యయ్యదియాచరింపవల దని బోధించినట్లైనా ?

"శక్యమరవిందసురభిః.........పవనః" ఇత్యాది ప్రయోగముల దిలకింపుడు. లేనిచో దెలిసికొనుడు.

ఇంక సమాలోచనమునందలి "ఉదహరించి" యను పదము తెలుగున తద్భవమగు సుశబ్దముగాని తత్సమశబ్దము గాదు. శ్రీ శాస్త్రిగారికి తెలుగుభాషా సంప్రదాయ పరిజ్ఞానము లేనందున, నియ్యది తత్సమశబ్దమని భ్రాంతి జెంది, తమ పత్రికయందు మహాసంరంభముతో ఉత్ + ఆ + హార యని ధాతూపసర్గల విభాగమును గనుపరచుచూ విమర్శించి, "యుదహార" యని నా వాతబడి కుంటుపడినట్లు వ్రాసిరి. శ్రీ శాస్త్రిగారికీవిమర్శ తెలుగుభాషాసంప్రదాయ పరిజ్ఞాన రాహిత్యము చేతనైన తత్సమశబ్దభ్రాంతిజనితముగాని, వేరొండు గాదు.

కావున తెలుగుభాషయందలి తద్భవపదకదంబము శ్రీ శాస్త్రిగారి వాతబడి కుంటుపడినదిగాని, "యుదహరించి" యను పదము నా వాతపడి కుంటుపడలేదు.

ఇంక వీరి నెం ౨ రు సమీక్షయందు 2 వ పేజీలో "అధ్వరులను జేయింపగోరుటయు" అని వాడిరి, "అధ్వరం యాతి" యను వ్యుత్పత్తిచే యాగములను జేయించువాని యందు అధ్వర్యుశబ్దము సిద్ధమయియుండగా, నదేయర్థమున నధ్వరశబ్దమును బ్రయోగించిన వీరిద్దాని నే వ్యాకరణమున సాధువైనట్లెంచెదరో వారికే తెలియవలెను. కావున శ్రీ శాస్త్రి గారు చేసిన విమర్శవలన వారికిగల భాషాసంప్రదాయ పరి

జ్ఞానమున్నూ, వారు ప్రయోగించిన ప్రయోగములవలన వారికి గల ధాతురూప ప్రత్యయజ్ఞానమున్ను లోకమునకు వ్యక్తమగుచుండ; నిట్టిపై రొరుల భాషావైదుష్యము నెన్న సమర్థులగు సర్వజ్ఞులని ముందెవ్వరనుకొనిరి ? ఇక ముందెవ్వ రనుకొనియెదరు ? వారి కా యాశ యేల ?

విషయవిమర్శనమున పదదోషములనెన్నుట మా కభీప్సితముగాదు. అయినను శ్రీ శాస్త్రిగారు వారి తొలి పత్రికయందే యిట్టిపనికి తాము ప్రయోజకకర్తలై మమ్ము నియోజించినందున మాకీ యకార్యకరణమనివార్యమైనది.

ఇకముందును శాస్త్రిగారు ప్రకృతవిషయమును పరిత్యజించి, పరనిందాప్రకరణమును బరిగ్రహించి, దానినే పొడగింపదలచినచో నకార్యము మాకును ననివార్యమగు నని విశ్వసింతురుగాత.

బండిశ్రోతులుగల శ్రీ శాస్త్రిగారియొద్ద దమ వాదమును రుజువుచేసికొనుట కెన్ని బండ్ల కాష్ఠము లున్నవో ? అట్టి కాష్ఠవాదమువలన నాకును భీతియే.

శాస్త్రవాదమున వాదతత్త్వము దేలినచో నిష్పక్షపాత పండితుల సిద్ధాంతము ననుసరించి నా వాదమును మార్చుకొనవలసివచ్చినచో మార్చుకొనుటకు నా కభ్యంతరము లేదు.

కావున నింకనైన నీ విషయమున తత్వజిజ్ఞాసువులగు మహానీయులు, విద్వత్సభను గావించి, యుదాసీనులగు పండితులను, మధ్యస్థులుగనునచి, వారిచే విషయ నిర్ణయమును గావించి, యానిర్ణయానుసారము, శిష్టులకు హితమునుపదేశించుటగాని, యహితోపదేశమును జేయునట్టి య శిష్టుల దమ వాదమునుంచి విరమింపజేయుట గాని, యత్యుత్తమధర్మమనియు, నందులకు నేను సంసిద్ధుడననియు, నిక ముందిట్టినిస్సారములయిన పత్రికలకు సమాధానమీయ బడదనియును, మా ప్రతికక్షులకు దెలియ జేయుచున్నాను.

ఇట్లు,

మల్లావఝుల వేంకట సుబ్బరామశాస్త్రి

వసుంధర ప్రెస్, తెనాలి.

గీతల నాధారపరచుకొని, వారి తొలిసమీక్షయందు మెండ టనే యపభ్రంశములయిన నిర్ణయముల నాపాదించి వ్రాసిరి.

మాకు భాషా సంబంధమయిన దోషములు గాని, యక్షరదోషములుగాని యెంతమాత్రము విమర్శనీయములు కాకపోయినను, వారికాకొంత లేకుండ వారి తప్పులను వారు చేసిన క్రియతోనే వారికిఁ దెలియఁజఅచుట వారి మర్యాదకుచితమను భావముతో "తుషావహా" మను పద మును విమర్శించితిమిగాని వేరొండు గాదు. ఈ విషయమున శ్రీ శాస్త్రిగారే మాకు మార్గదర్శకులయిరని పండితలోక మును గ్రహింప గోరుచున్నాను.

కాని యిపుడు శ్రీ శాస్త్రిగారు దీనిని సాకుజేసికొని భాషావిమర్శనముగూడ జేసి, భాషాపాండిత్యమును తెలిసికొన నవసరముకలిగినదని ప్రకటించుచు విమర్శించిరి.

అందుకు తగు సమాధానమునిచ్చి యావల వీరు తమభాషయందు తామెట్లు ప్రవర్తించిరో పండితులకు వ్యక్త పఱచెదను. మా నిర్ణయపత్రిక 3వ పేరాలో 'దుర్బోధమిమం, కర్మజాతం' అని యున్నది. ఇచట 'ఇదమ్' అను పదమునం దలి దకారమునకు బదులుగ నచ్చులోపమున మకారము పడియుండవచ్చును. ఆవలి మకారభ్రాంతివలన' "అయం యజ్ఞః.........అనుష్ఠేయం భవతి" యనుచోట "అను ష్ఠేయం" అను పదము లింగసామాన్యమున ప్రయోగింప బడినది. కావున నయ్యది సాధుతమము. కావలసినచో

ప్రయోజనము లేదుగదా ? కావున నాహితాగ్నులకు పితృ యాగాచరణావశ్యకతను బోధించుటకీ ప్రణాళికను తయారు చేసిన శ్రీ శాస్త్రిగారు, ధర్మధ్వజులగు బ్రాహ్మణబ్రువులో లేక తదితరులో నిర్ణయించుట నాకును నభిమతమే.

౬. శ్రీ శాస్త్రిగారు తమ తొలి సమీక్షయందు, తై. బ్రా. 1-3-10 యనువాకములోని, తుదివాక్యమితికర్తవ్యతా బోధకమని, వాకృచ్చి, శ్రుతివాక్యములచే నావిషయ ముపపాదన మొనర్చుటలో 'ప్రతనుతే' యనుపదమును లేదర్థకముగ నిర్ణయించి విధానమును నిరూపించిరి. కావున నుదుంబరఫల గర్భులగు, శ్రీ శాస్త్రిగారు బోధనమును మదియందిడుకొని, విధానబోధనముల భేదము నరయలేక జేసిన విధానోపపాదనమును, ఖండించితిమి. కాని, యర్థవాద నిష్క్రియణ బోధకము గాదనలేను.

౭. ఈ పేరాకు మాతొలిపత్రికయందే విస్తృతముగ సమాధాన మిచ్చియుంటిమి. కావున గ్రంథవిస్తరభీతిచే నిచట మరల సమాధానము నిచ్చుటకుపరమించు చున్నాను.

౮. శ్రీ శాస్త్రిగారు వారిపత్రికయందలి పొరపాటులను గమనించక, పైపెచ్చు నా పత్రికయందు వ్రాత పొరపాచ్చెములుగాని, యచ్చు పొరపాచ్చెములుగాని కలవను సూచనగ, గొన్ని తప్పులను సరిదిద్ది వారికి పత్రికపంపినను, వారద్దానిని ఋజుభావముతోఁ జదువుకొనక అసమాపక వాక్యచిహ్నమునకు బదులుగ నచ్చుపొరపాటున పడిన జంట

మఱియు, పిండపితృయజ్ఞము శ్రుత్యాశయమున కామ్య కర్మయనియుండ, నిత్యకర్మయని వాదించు వారలును, శ్రుతికి మహాపరాధ మొనర్చినవారే కదా? శ్రుత్యాశయమును బట్టి వారును, అబ్రాహ్మణులే కదా? ఇట్టి యపార్థములను గ్రహించి వ్రాతలను వ్రాయునేర్పరుల కెట్టి సాధువచనము లయినను జ్ఞాపకమునకు వచ్చును. అభావమున ప్రతియోగిప్రసిద్ధి, యవసరము గాన, అ సాధుపుంగవులకు సాధువచనము జ్ఞాపకమునకు వచ్చుట యుచితము.

శ్రీ శాస్త్రిగారు 13 వ పేజీలో, పితృయాగము చేయనిచో, నాదినమునకమావాస్యాత్వ సిద్ధిగలుగదు 'గావున' మొదలగు వాక్యములను వ్రాసిరి. పితృయాగము చేయని నాటి యమావాస్య పున్నమ యగునా? లేక నారోజు శ్రీ శాస్త్రిగారిపాలిట యతిథి యగునా? అమా—సహ—వసు అస్మదీయం—ధనం అను శ్రుత్యర్థమును మదియందిడుకొని కాబోలు. యేమేమో వ్రాసిరి. కాని పూర్ణిమాప్రయుక్త కర్మలు సిద్ధించుటకు పూర్ణిమాత్వ సిద్ధియెట్లు? పితృయాగముచే నమావాస్యాత్వము సిద్ధించి యమావాస్యా ప్రయుక్త కర్మలు సిద్ధించినను, పూర్ణిమాత్వము సిద్ధింపనిదే పూర్ణిమా ప్రయుక్త కర్మలు సిద్ధింపవుగావున, దర్శపూర్ణమాస యాగములయొక్క సముదాయమునకు, ఫలమగు స్వర్గము సిద్ధింపదుగదా? యాగసముదాయము యొక్క ఫలము సిద్ధింపనిదే సముదాయైక దేశములగు, దర్శయాగములు సిద్ధించినను,

జెప్ప నవకాశము కలదాయని సవాలుచేయు శ్రీ శాస్త్రి గారు, గీతలవలన తలవ్రాతను బయల్పరచుకొంటిమని లజ్జావనతశిరస్కులై యుండక పైపెచ్చు వాదమునందలి సాధుత్వమును నిర్ణయించునట్టి సాధువులమని రచ్చకెక్కుటకడు వింతయగుచున్నది.

కొన్నితప్పులనుసవరించి పత్రికలను పంపినచో, మరెచటను, పొరపొచ్చెములు లేవని యర్థమా? ఏతప్పులను సవరించకయే పంపు పత్రికలందు, అన్ని తప్పులేనియా? లేక అన్నియొప్పులనియా? ఇందేపక్ష మాశ్రయించినను వారు వారి పత్రికలను నిర్దుష్టపరచుకొనలేరు. కావున నా పత్రికయందావంతయు నపభ్రంశము లేదనియు, వారు వారిబుద్ధిగతమగు నపభ్రంశమును, వారి వాదమునకు హైన్యము తటస్థించునప్పుడును, మావాదమునకు బలము సమకూరునప్పుడును, వారు వినియోగించుకొనియెదరనియును శిష్టులకు విన్నవించుచున్నాను.

౪. గృహస్థులాచరించు కర్మలయందు కర్మానుష్ఠానమొనర్చు గృహస్థులు జోక్యముకలిగించుకొనుట, యుక్తము కావచ్చునేమోకాని, నిఖిల కర్మలను నీటముంచి, జీతము డబ్బులతో నభ్యవహారకర్మనుమాత్రి మొనర్చు శ్రీ శాస్త్రి గారి వంటి గృహస్థులు జోక్యము కలిగించుకొనుట పొరబాటను నావచనము సమూలముగాని, నిర్మూలమెంత మాత్రము గాదు.

ఇచట వీరు కాత్యాయన కల్పసూత్రములందలి 'అనారంభోవా' అను 25 వ సూత్రమును దిగమ్రింగి, 26 వ సూత్రమునందలి మొదటియక్షరమగు నకారమును నవిలివైచి 26 వ సూత్రమును 25వ సూత్రస్థానమున జేర్చి, 26వ సూత్రమునకు 25వ నెంబరును వేసి, 30 సూత్రములతో ముగిసిన కండికను 29 సూత్రములతో ముగింపుచేసి, నా వాదమును ఖండించిరి,

ఇట్లు వీరు తమ సిద్ధాంతపోషణకు సూత్రములను దిగమ్రింగుచు, వారనినమాట కాదనినచో మనుష్యులను గూడ దిగమ్రింగజూతురు. ఇయ్యది కాష్ఠవాదమా ? లేక పాషాణవాదమా ? దేవతలపాలిట క్రవ్యాదులు ప్రవర్తించినట్లు, దేవతోద్దిష్టకర్మలపాలిట వీరు సూత్రాదులయి ప్రవర్తిల్లుచున్నారనుటకు సందియ మేమి ?

శ్రౌతాగ్నిహోత్రికి విధింపబడిన దర్శపూర్ణమాస యాగములకు ప్రతినిధులుగ స్మార్తాగ్నిహోత్రికి ప్రతిపత్ స్థాలీపాకములు విధింపబడినంతమాత్రమున సిద్ధాంతిగారు వ్రాసినట్లు దర్శాదియాగములయొక్క యాగదంశసాజాత్యము స్థాలీపాకములకు సూత్రక్రమమునుబట్టిగాని, శాస్త్రసిద్ధాంతమునుబట్టిగాని సిద్ధింపనేరదు.

కావుననిట్టి పరప్రతారణాబుద్ధితో నవలవక మీమాంసలను రచించి ప్రెకి, ధర్మప్రచారకులమని చెప్పుకొనుచు, కర్మలను తారుమారుచేసి, కర్మానుష్ఠాతల నిందించుటకంటె

కండికలో, 1 వ సూత్రమునుండి, 22 వ సూత్రము వరకు పిండపితృ యజ్ఞము నుపదేశించి, 23 వ సూత్రముతో జీవత్పితృనకుగూడ నీ పిండదానాత్మకమగుకర్మ ప్రవర్తించుచున్నదని పూర్వపక్షము మొదలిడి, 24 వ సూత్రముతో "హోమాంత" మనుగౌణ పక్షము నుపదేశించి, "అనారంభోవా" 25 అను 25 వ సూత్రముతో, జీవత్పితృనకు పిండపితృ యజ్ఞా నారంభమును సిద్ధాంతీకరించి, ఆపై 26, 27, సూత్రములచే నాసిద్ధాంతమును సమర్థించెను.

దీని కనువుగ కర్కభాష్యమును చూడుడు. 23 వ సూత్రమునకు పైన, (జీవత్పితృకస్య పిండపితృ యజ్ఞాననుష్ఠానం) అను శీర్షికయు, 27 వ సూత్ర భాష్యాంతమున "అతోఽనారంభ ఏవేత్యవధార్యతే" అను వాక్యమును యున్నవి. ఆవల 28 వ సూత్రముతో ప్రకరణాంతరమును ప్రారంభించి, 30 సూత్రముతో నా ప్రకరణమును ముగించెను.

కావున నీచతుర్థాధ్యాయ ప్రథమ కండిక 1 మొదలు 22 వరకు పిండపితృయజ్ఞ నిరూపణ ప్రకరణమనియు, 23 మొదలు 27 వ సూత్రాంతము వరకు, జీవత్పితృకునకు పిండపితృ యజ్ఞానారంభ ప్రకరణమనియు, 28, 29, 30 సూత్రములతో అంగత్వనిరూపణప్రకరణమనియు, మూడు ప్రకరణములతో విరాజిల్లుచున్నదనుట సుస్పష్టము.

ఇట్లు కాత్యాయనశ్రౌతసూత్రగభస్తిమాలి సహస్ర కిరణములతో భాసిల్లుచుండ జాత్యంధులగు మా ప్రతికక్షుల కీయవి కానరాక, నేను నా పత్రికయందు వ్రాసిన "ఆహితాగ్నీనామపి జీవత్పితృకాణాం పిండపితృయజ్ఞానారంభః । కాత్యాయనప్రభృతిభిః కైశ్చిత్సూత్రకారైరభ్యుపగతః"— అను విషయమును ఖండింపసాగిరి.

పాఠక మహాశయులారా! మా ప్రతికక్షులిచ్చోట జేసిన మోసమును చూడుడు.

వారు వారి పత్రికయందిట్లు వ్రాసిరి:—

"కాత్యాయనకల్పసూత్రమందలి నాల్గవయధ్యాయము; "అపరాహ్ణే పిండపితృయజ్ఞశ్చంద్రాదర్శనేఽమావాస్యాయామ్" అను సూత్రముతో నుపక్రమింపబడి, "ఆధత్తేతి మధ్యమపిండం పత్నీ ప్రాశ్నాతిపుత్రకామా" అను 22 వ సూత్రమువరకు పితృయాగము నుపదేశించెను. ఆ పై సూత్రములిట్లున్నవి. "ప్రేతేభ్యోదదాతిజీవపితృకోపి జీవాంతర్హితేఽపి" 23; "జీవత్పితృకస్యహోమాంతం" 24; 'వ్యవేతెజాతూకర్ణ్యః' 25; 'నజీవంతమతీత్య దదాతీతి' 26; 'పూర్వోవాంగత్వాత్పిండపితృయజ్ఞః' 27; 'ప్రకరణకాల లింగానుగ్రహవచ నాహితాగ్ని శ్రుతిభ్యోనాగ్నిం' 28; 'అంగం వాసమభివ్యాహారాత్' 29 అని.

ఇట్లు 'కాత్యాయనశ్రౌతసూత్రభానుడు ప్రకాశించుచున్నను మా పూర్వపక్షులూకములకయ్యది కానరాక' అని.